# ఒంటరి రాకుమారుడు

మ్యాక్స్



అనగా, అనగా విలియం అనే రాకుమారుడు ఉండేవాడు. రాజు, రాణి అయిన అమ్మా, నాన్నలతో అతడు ఒక పెద్ద మహలులో ఉండేవాడు. ఆ మహలు చుట్టూ అందమైన తోట ఉంది.

విలియం ఎంతో గారాబంగా పెరిగాడు. అతడు ఏది అడిగితే అది ఇచ్చేవాళ్లు. అందుకు అతడు సంతోషంగా ఉండాలి, కానీ ఎందుకో అతడు అలా ఉండేవాడు కాదు. అతడు నవ్వేవాడు కాదు, ఏడ్చేవాడు కాదు. ఎప్పుడూ విచారంగా ఉండేవాడు.

దాంతో రాజు, రాణి బాధపడే వాళ్లు. “నువ్వు విచారంగా ఎందుకు ఉన్నావు?" అని అతడిని అడిగేవాళ్లు.

“ఆడుకోటానికి ఎంతో ఖరీదైన బొమ్మలు ఉన్నా నువ్వు విచారంగా ఎందుకు ఉన్నావు?"

విలియం ఒక్క క్షణం ఆలోచించి, “నా దగ్గర వేడి గాలి బుడగ లేదు," అన్నాడు.

“నువ్వు సంతోషంగా ఉంటానంటే వెంటనే దానిని తెప్పిస్తాం," అన్నారు రాజు, రాణి.







మరునాడు వేడి గాలి బుడగ తెచ్చి దాంట్లో గాలి నింపారు. విలియం అందులోకి ఎక్కి ఆ రోజంతా మహలు పైనా, తోట పైనా తిరిగాడు. అయినా అతడి ముఖంలో నవ్వు లేదు, ఏడ్పు లేదు. ఇప్పుడు కూడా అతడు విచారంగానే ఉన్నాడు.

రాజు, రాణి ఎంతో బాధపడ్డారు.
"ఆడుకోటానికి నీ దగ్గర ఎంతో ఖరీదైన బొమ్మలు, ఇంకా వేడి గాలి బుడగ ఉన్నాయి," వాళ్లు అన్నారు. “నీకు ఇంకేం కావాలి?"

“నాకు బోనులో సింహం కావాలి," బదులిచ్చాడు విలియం.

“సరే," రాజు, రాణి నిట్టూర్చారు, “నువ్వు సంతోషంగా ఉంటానంటే వెంటనే బోనులో సింహాన్ని తెప్పిస్తాం!"



బోనులో సింహంతో విలియం రోజంతా ఆడాడు. ఒక కర్ర పుల్లతో సింహాన్ని చికాకు పరిచాడు. తినటానికి దానికి మాంసం పెట్టాడు. అయినాగాని విలియం ముఖంలో నవ్వు లేదు, ఏడ్పు లేదు. అతడు ఎప్పటి లాగా విచారంగానే ఉన్నాడు.

రాజు, రాణి ఎంతో బాధపడ్డారు.

"ఆడుకోటానికి నీ దగ్గర ఎంతో ఖరీదైన బొమ్మలు, వేడి గాలి బుడగ, బోనులో సింహం ఉన్నాయి," వాళ్లు అన్నారు. "నీకు ఇంకేం కావాలి?"

"నాకు ఒక సైన్యం కావాలి," విలియం అన్నాడు.

"సరే," రాజు, రాణి అన్నారు, "నీ కింద ఒక సైనిక పటాలం ఉంటుంది. ఇకనైనా సంతోషంగా ఉండు!"







ఒక రోజు అంతా సైనిక పటాలంతో గడిపాడు విలియం. సైనికులకు ఆజ్ఞలు ఇచ్చాడు, గుర్రం మీద సవారీ చేశాడు. అయినాగాని విలియం ముఖంలో నవ్వు లేదు, ఏడ్పు లేదు. అది ఎప్పటి కంటే ఎక్కువ విచారంగా ఉంది.



ఒక రోజు విలియం తోటలో తిరుగుతూ ఉండగా తోటమాలి కొడుకును చూశాడు. అతడు తన ఇంటి ముందు పెంపుడు కుందేలుతో ఆడుకుంటున్నాడు. దానికి ఆకులు తినిపించాడు. దాని బొచ్చుని నిమిరాడు.

విలియం అతడినే చూస్తూ ఉండిపోయాడు.

"నా దగ్గర డబ్బుతో కొనుక్కునే బొమ్మలు ఉన్నాయి, వేడి గాలి బుడగ ఉంది, బోనులో సింహం ఉంది, ఒక సైనిక పటాలం ఉంది. కానీ కుందేలుకి ఆకులు తినిపించటం, దాని మెత్తని బొచ్చుని నిమరటం అన్నింటికంటే బాగుంటుంది," అని అతను అనుకున్నాడు.

విలియం పరిగెత్తుకుంటూ ఆ పిల్లవాడి దగ్గరకు వెళ్లాడు. "ఆ కుందేలును నాకు ఇవ్వు," అని అడిగాడు.

"ఇవ్వను," కుందేలును గట్టిగా హత్తుకుంటూ ఆ పిల్లవాడు అన్నాడు. "ఈ కుందేలు నాది. దానిని నీకు ఇవ్వను."



అమ్మా, నాన్నలకు ఆ విషయం చెప్పటానికి విలియం కోటలోకి వెళ్లాడు.

“నా దగ్గర డబ్బుతో కొనుక్కునే అన్నీ బొమ్మలు ఉన్నాయి. వేడి గాలి బుడగ ఉంది. బోనులో ఒక సింహం ఉంది. ఒక సైనిక పటాలం కూడా ఉంది. కానీ అన్నింటికంటే ఒక కుందేలు ఉంటే బాగుంటుంది."

“కుందేలుతో నువ్వు సంతోషంగా ఉంటానంటే తప్పకుండా దానిని ఇస్తాం," అన్నారు రాజు, రాణి.

మరునాడు విలియం తన కుందేలుతో ఆడుకున్నాడు. దానిని ఎత్తుకున్నాడు, పొడవాటి చెవులను నిమిరాడు. దానికి ఆకులు తినిపించాడు. అయినప్పటికీ విలియం ముఖంలో నవ్వూ లేదూ, ఏడ్పూ లేదు. అతడు మునుపటికంటే ఎక్కువ విచారంగా కనిపించాడు.

“నాకు ఏదో ఒక కుందేలు వద్దు," అతను అన్నాడు. “తోటమాలి కొడుకు దగ్గర ఉన్న కుందేలే కావాలి."





తోటమాలి కొడుకు దగ్గరకు విలియం వెళ్లాడు.
"నీ కుందేలును నాకు ఇస్తావా?" అతను అడిగాడు. "బదులుగా నా బొమ్మలన్నీ నీకు ఇస్తాను."

"ఇవ్వను," అన్నాడు తోటమాలి కొడుకు.

"నీ కుందేలు నాకు ఇవ్వవా," బతిమాలాడు విలియం. "నా బొమ్మలన్నిటితో పాటు వేడి గాలి బుడగ కూడా తీసుకో."

"నేను ఇవ్వను. నాకు ఏమీ వద్దు," అన్నాడు తోటమాలి కొడుకు.





“దయచేసి నీ కుందేలును నాకు ఇవ్వు," విలియం మూడోసారి అడిగాడు. “నా బొమ్మలు అన్నిటి తోపాటు, వేడి గాలి బుడగ, బోనులో సింహం, సైనిక పటాలం మొత్తం తీసుకో."

“నేను ఇవ్వను. నాకు ఏమీ వద్దు," మళ్లీ అదే సమాధానం ఇచ్చాడు తోటమాలి కొడుకు.

అది విన్న విలియం ఉన్నట్టుండి పెద్ద పెట్టున ఏడ్వసాగాడు.

అది చూసి తోటమాలి కొడుకు బాధపడ్డాడు. అతడు విలియంతో, “నా కుందేలు అంటే నాకు ఎంతో ఇష్టం. దానిని నేను ఎంతో ప్రేమిస్తాను. అందుకే దానిని నీకు ఇవ్వలేను. కానీ, మనిద్దరం కలిసి దానితో ఆడుకోవచ్చు," అన్నాడు.





మరునాడు ఉదయం రాకుమారుడు విలియం, తోటమాలి కొడుకు ఇద్దరూ కలిసి కుందేలుతో ఆడుకున్నారు. దాని మెత్తటి వెన్నుని నిమిరారు, దానికి ఆకులు తినిపించారు.

ఆ రాత్రి విలియం గదిలోకి రాజు, రాణి వెళ్లినప్పుడు విలియం విచారంగా లేకపోవటం చూసి ఎంతో సంతోషించారు.

“నువ్వు సంతోషంగా ఉన్నావు," వాళ్లు అన్నారు.

అప్పుడు ఒక వింత జరిగింది.

విలియం ముఖంలో నవ్వు అలుముకుంది.

“అన్నిటి కంటే నాకు ఏమి కావాలో ఇప్పుడు అర్థమయ్యింది," విలియం అన్నాడు. “నాకు ఒక స్నేహితుడు కావాలి!"

రాజు, రాణి హతాశయులయ్యారు. “కానీ, నీకు స్నేహితుడిని మేం ఇవ్వలేం," వాళ్లు అన్నారు. “నీ అంతట నువ్వే స్నేహితులను చేసుకోవాలి."

“నాకు ఒక స్నేహితుడు దొరికాడు," విలియం చెప్పాడు. జీవితంలో మొదటిసారి అతను నవ్వాడు.





అయిపోయింది